# శ్రీరామ ద్విశతి

BY

## లంకిపల్లె ఓబయ్య నాయుడు

ప్రతులు 2000

మొదటి ప్రింటింగ్ 1997 - 5 - 10

చిరునామా :

ఓబయ్య నాయుడు

~~చిన్నప్ప సముద్రం~~

~~టీచర్స్ కాలనీ~~

మదనపల్లె ~~స్పిన్నింగ్ మిల్లు~~ [P.O]

మదనపల్లె మండలం.

చిత్తూరు జిల్లా [A.P]

పుస్తకం వెల 12 - 00

ఓం సత్యం శివం సుందరం

ఓం నమో భగవతే శ్రీ సత్యసాయీశాయ

సమస్త లోక సృష్టి, స్థితి, లయకారకుడైన,

శ్రీ మన్నారాయణుడే, శ్రీ సత్యసాయిగా, నరరూపమున, జన్మించి, మనుజులలో, మనుజుడై మానవులకు మాధవప్రాప్తి గల్గు మహోపదేశములు, చేయుచు భక్తి, భుక్తి, ముక్తులు, భక్తులకొసంగుచున్న, మహా సత్యసాయిగారికి, సూర్యునకు చిఱుదివ్వెను జూపినట్లు, నేను రచించిన శ్రీరామద్విశతి యను గ్రంథమును, శ్రీవారి కంకితమొనర్చుచు, వారి దయకు పాత్రుడను, కాగోరి అంకితమును దీసికొనుమని, అభ్యర్థించుచు లంకిపల్లి ఓబయ్య నాయుడననే గ్రంథకర్తగా, శ్రీ వారికి రచించి, సమకూర్చిన పద్య కుసుమ హారము

క. శ్రీ సత్యసాయి భగవాన్
గాసిల్లితి నింతవరకు కష్టంబులతో
మీ సమకాలికుడైనే
జేసితి నిన్నాళ్ళు తప్పు, చేరకమిమ్మున్ 1

క. సమకాలిక భగవానుని
గమనింపరు చాలమంది, గడుసుదనముతో
గమనించు భక్తులందరు
మిము జేరియు ధన్యులైరి మేదినిలోనన్ 2

క. కనబడు దేవుని దలువరు
కనబడకున్నట్టివాని, కరదీపికలన్
ఘనముగ వెదకుచునుందురు
కనబడునే యట్టివారి కాదేవుండున్ 3

సీ॥ ఆదినారాయణుడై యుండియ వనిలో
సంభవించిన సత్యసాయి వీవె
పలసిన వస్తువుల్ వరుసగా సృష్టించి
భక్తుల కొసగెడు బ్రహ్మ వీవె
నిను నమ్మి సేవింప నేర్చిన భక్తుల
స్థిరముగా రక్షించు, విష్ణుడవీవె
అలబయంశంబున నందర దయజూచి,
శక్తినొసంగెడి శక్తి వీవె

తే: సుబ్రహ్మణ్య వినాయక, సురసమూహ,
మునులును, శ్రీరామ కృష్ణాది ముఖ్యులైన
యేసు, మహమదు, బుద్ధులై యీ జగాన,
వెలయుచున్నట్టి దేవతావిభుడవీవె 4

సీ. విష్ణుండవీవని, వివరించుటకుగాను
ధనలక్ష్మి మీ చెంత తరుగదయ్యె
బ్రహ్మయేనీవని భావించుటకుగాను
విద్యదేవతనిట, వెలయుచుండె

శంకరుండీవని, శంకంబుగా దెలియ
లింగముల్ దీయుట లీలలయ్యె
అంబయే నీవని యంగీకరింపంగ
కనతల్లి ప్రేమయే గానవయ్యె

తే. సకల దేవాంశ మీలోన సమముగాను
గల్గియున్నట్లుగా మాకు, గానవయ్యె
వేదవేదాంత వేద్యయో, విబుధవర్య
సత్యసాయీశ కరుణించు సాధుపోష 5

సీ. పుట్టలమయమైన, పుట్టపర్తియనేడు
పట్టణంబుగ మారి ప్రబలుచుండె
మిట్టలు గుట్టలు మీ ప్రభావంబుచే
కట్టడంబుల తోడ గ్రాలుచుండె

నాగ సర్పములున్న నాటి దుర్గతి బోయి
నక్షత్రశాలలీనాడు నిండె
కడుదుష్ట మృగముల కల్గులన్నియు బోయి
విద్యాలయంబులు వెలయుచుండె

తే. పక్షులున్ దిరుగునట్టి నీ ప్రాంతమందు
దివ్యమైన విమానముల్ దిరుగుచుండె
ముండ్లచెట్లుండినట్టి యీ మొఱపనేల
కల్పవృక్షంబు లీనాడు గల్గియుండె 6

సీ. విశ్వంబులో మిమ్ము విశ్వసించిన జనుల్
దేవుడేయని నమ్మి దిరుగుచుండ్రు
దీవెనల్ గొనవచ్చి దేశాధినేతలు
మీరు జెప్పిన రీతిమెలగుచుండ్రు

కోటీశ్వరులు వారి కోర్కెలుదీరంగ
నీ సేవలో సదానిలచియుంద్రు
విద్వాంసులరుదెంచి, విబుధుండవని వేడి
ప్రాబల్కలెప్పుడు బల్కుచుంద్రు

తే. తెలివిగలవారు మిమ్మట్లు దెలిసికొనియు
గర్వమునువీడి వినయంబుగా మెలంగి
సేవ భావంబుతో మీరుజెప్పినటుల
భక్తితోవెలయు చున్నారు భవ్యచరిత 7

5 ఇంత విశిష్ట గుణంబులు
నున్న మహాపురుషుడీవు నొనరుగ మాకున్
నెన్నగ దొరికిన కతమున
మన్ననతో కవితనీయ మామది గలిగెన్ 8

క శ్రీరామ ద్విశతి యనియెడు
నారా మునిచరితమిపుడు, నరులకు దెలియన్
గారాబంబున వ్రాసియు
చరితి మీకంకితంబు, జేసెదు కాంక్షన్ 9

క. కాదనక సమ్మతించియు
మీదయ నామీదజూపి, మీపదసేవల్
సాదరముగ దయసేసియు
నేధన్యత జెందునటుల చొఅపు మహాత్మా 10

ఆ. కాళ్ళ్గడిగి కవిత. కన్యనొసంగెద
కట్నమియ్యలేను గాననాడు
హృదయ పీఠమందు, ముదముతో నెలకొని,
మమ్ము గావుమయ్య మాన్యచరిత 11

క. కవితాకన్యగుణంబులు
భువిలో సామాన్యులకును, బోలదు పోల్పన్
భవబంధంబుల ద్రెంచియు
చావును పుట్టుకలులేని, సద్గతి నొసగున్ 12

క. సాక్షాల్లక్ష్మి సరస్వతి
వీక్షింపగ గౌరివలెను, వెలయుచు మహిమల్
మోక్షము భక్తులకొసగెడు
దక్షతగల దీమెయందు దనరగ సాయీ 13

## శ్రీరామ ద్విశతి

క. శ్రీరామ దివ్యచరితము
పౌరులకందరికి దెలిపి పరమాత్మునిపై
వారి మదిన్ మరలింపగఁ
గోరితి మిసాయమిపుడు, కుదురుగా స్వామీ 1

క. మీ భక్త బృందములు మా
కీ భాగ్యమొసర్చి సభల, కెళ్ళిన చోట్లన్
శోభింప రామతత్త్వము
వేభంగుల వెల్లడింప, వెలువగు స్వామీ ! 1

క. కలలో సాక్షాత్కారము
గలుగగ నాకొక్క నాడు, కడుసంతసమున్
గలుగగ మీ పాదంబులు
పలుమారులు నద్దుకొంటి, భక్తిగ స్వామీ 1

క. పన్నిట గడుగు పాదము
కన్నీటన్ గడిగినాడ, గాఢపుభక్తిని
నన్నున్ దయతో జూచియు
మన్ననతో కవితగొనుము, మరుపక సాయీ 1

క. మీయాజ్ఞమైనదనియున్
నేయొసగితి నంకితంబు, నీ కావ్యంబున్
సాయీగైకొని దీనిని
సేయుము పరిపాలనంబు, చెంతననుండని 1

క. అన్ని విధంబుల నాతున్
మన్ననతో దోడుపడుచు, మా దేవుడవై
నన్నున్ ముందుకు నడుపుము
నిన్నున్ విడలేరు దిక్కు, నిజముగ సాయీ 1

క. మంగళము సాయినాథా!
మంగళమగు మీకు సర్వమాన్య చరిత్రా
మంగళము భక్తవినుతా!
మంగళమిదె గొనుము లోక, మందరివలనన్ 2(

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు

ఓం శాంతిః ఓం శాంతిః శాంతిః

సంస్కృతశిరోమణి
శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు
**M. A.,**

# నివేదన

ఆత్మీయులు లంకిపల్లి ఓబయ్యనాయుడుగారు, కర్షక కుటుంబానికి చెందినవారు వారు విద్వాన్ పరీక్షకు కృషిచేసి, తెలుగులో పాండిత్యం గడించారు. అయినా ఎప్పుడూ ఉద్యోగం చేపట్టలేదు, కష్టపడి వ్యవసాయము చేస్తూనే జీవిస్తున్నారు.

శ్రీ నాయుడుగారు ఆధ్యాత్మిక భావాలపట్ల, మిక్కిలి శ్రద్ధగలవారు· ముఖ్యంగా వీరు, బ్రహ్మలీన పూజ్యపాద గండి భూమానందాశ్రమాధిపతులు శ్రీ రామకృష్ణానంద స్వాములవారి అనుయాయులు. వారి గీతోపన్యాసములను బాగుగా చదివి అనుసంధానం చేసినారు·

వీరికి కవిత వెన్నతో బెట్టిన విద్య, కీర్తిశేషులు శ్రీ యన్. టి. రామారావుగారి మీద, వీరు వ్రాసి వేసిన. పద్యరత్నహారము చూపరుల చూపులకు మిరుమిట్లు గొల్పినది. అందువలన పలువురి ప్రశంశలు పొందినది. భగవద్గీతను వీరుతో హరగేయములుగా వ్రాసినప్పుడు, వీరి రచనా విధానానికి మెచ్చి, తిరుమల-తిరుపతి దేవస్థానము వారు దాని ముద్రణకు ఆర్థిక సహాయము చేశారు.

ప్రస్తుతం వీరు శ్రీ రామ ద్విశతి అన్న ప్రబంధమును, గద్య పద్యమయమైన తీర్చిదిద్దారు. రచన సరళశైలిలో సాగినది. ఈ రచన **T.T.D.** వారి ఆర్థిక సహాయాన్ని పొందినది. ఇందులో రామాయణ. పూర్వ గాథ, ఉత్తర గాథలు రెండూ నిబంధింపబడినవి. రాముని శీలం సర్వోత్తమంగా తీర్చిదిద్దబడింది.

క అందముల్లై వినవిన చెవి
కందముల్లై మంచినీతి. కందముల్లైతే
అందరు చదువుదురభినవ
కందర్పా కుందపరప్రకవిచపదప్పా

అని కవి చౌడప్ప జెప్పినట్లు, అందమైన కంద పద్యాలలో సామాన్యులకు కూడా అర్థమయ్యే రీతిలో "శ్రీరామ ద్విశతి ని" రచించిన సహజకర్షకకవి, అధ్యాత్మిక, కవి, శ్రీ లంకిపల్లె ఓబయ్యనాయుడుగారు, అందరి అభినందనీయులు ఈ రచన పాఠకులను ఆకర్షించి, విస్తృత వ్యాప్తి పొందాలని మనసారా ఆశిస్తున్నాను.

సముద్రాల లక్ష్మణయ్య
కార్యదర్శి

తిరుపతి

ధర్మ ప్రచార పరిషత్
తిరుమల - తిరుపతి దేవస్థానము

13-12-1996

---

ఇట్లు; శ్రీ రామ ద్విశతి గ్రంథకర్త . సాయిం మార్పణమస్తు.

శ్రీ లంకిపల్లి ఓబయ్యనాయుడు, ఆంధ్రభాషావిశారద మరియు

బి. విద్వాన్ తెలుగు. ~~ఇంటి నెం. 8-16-3, టీచర్స్ కాలని~~ 1-512 లక్ష్మినగర్ వీధి

~~చిన్నతిప్పసముద్రం, ( C.T ) కోళ్ల్రాకారోడ్, సమీపం.~~

మదనపల్లి ~~సిమ్స్ స్కూల్~~ (పోస్టు)

మదనపల్లి మండలం చిత్తూరు జిల్లా (ఆ. ప్ర.)

ము మేళవించి రామా అను మకుటమును తొలగించినచో అది సంగ్రహ రామాయణమే యనుట నిస్సందేహము. శ్రీరామ నిర్యాణముతో శతకమంతమైనప్పుడిది. విషాదాంతము కాదా? అను ప్రశ్న ఉదయించును అందుకే కవి. "రాముడవ్వేళ వైకుంఠధాముడయ్యె" అనగా శ్రీరాముని శరీరము అందరి శరీరమువలె పడిపోవడం గానీ, నదిలో మునిగినపుడింకొక శరీరము వలె రావడంగాని జరుగనీయలేదు. (జరుగలేదుకూడ) అసలు రాముడు నదిలోనే మునుగలేదు బ్రహ్మదేవుడు, స్వామిముహుర్తం దాటిపోవుచున్నదనీ శ్రీరాముని హెచ్చరించడం వెంటనే ఆశ్రీరామశరీరమే శ్రీ విష్ణు దేవుడుగా పైనుండి క్రిందికి మార్పుచెందడం జరిగింది. ఈ విధముగా రామావతారము పరిసమాప్తమైనట్లు తెలిపెరి.

రావణుడు కైక, మందర వంటి పాత్రలు పూర్వాపూర్వ పర్యాలోచనలతో పరిశీలించి, ఇందుకు ముందు మరెవ్వరు చెప్పని విధముగా ఓబయ్యనాయుడుగారు తత్త్వరహస్యమును విప్పిచెప్పుట, ఈ ద్విశతిలో ఎన్నదగిన విశేషము కావ్యాంతమున ఫలశ్రుతి, మంగళము శాసనము తెలుపబడినవి. రచనా సౌందర్యమును విశదీకరించుటకు ప్రతి పద్యమును నుదహరింపవలసివచ్చును ఇప్పటికేపీఠిక విస్తరించుటచే ప్రస్తుతమునేనీపద్యములజోలికి పోలేదు. రస హృదయులైన సహృదయులు. పఠించుసందర్భమున ప్రతిపద్యసౌంధర్యంమును అందలిఔచిత్యంను గ్రహించిరసానందపారవశ్యమును పొందుదురుగాక

క. శ్రీ లంకిపల్లి ఓబయ
నాబుధశ్రేష్ఠు వాణనిలిచి నవ్యకవిత్వ
శ్రీలవెలజల్లి మల్లెల
మాలయగుచు గురుతరముగ మాధురినింపెన్

డా॥ మల్లెలగురవయ్యగారు.
రీడర్ తెలుగు శాఖాధ్యక్షులు
బిసెంట్ దివ్యజ్ఞాన కళాశాల
మదనపల్లి

# అభిప్రాయము

శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మలీన రామకృష్ణానంద స్వాములవారు "గీతా వాణి సంపాదకులు" భూమానందాశ్రమం, గండిక్షేత్రం

## మా గురుదేవులు

వీరు మా ఆధ్యాత్మిక గురుదేవులు. వీరి ఆశీర్వాద బలము వలన శ్రీ కృష్ణపరమాత్మ దయవలన ఇపుడూ నేనొక రచయితనైనాను. వీరు నాకు 1984 శ్రీమద్భగవద్గీతను గూర్చి ఇచ్చియుండిన అభిప్రాయమునే నేనిందు పొందుపరచు చున్నాను.

## ఇక వారి సందేశము

భక్తునకు భద్రకాముని, భద్రాశీస్సులు నాయినా! ఓబయ్యా నీ పట్టుదల ఫలించినది నీ గీతాసేవ ఫలించినది "నహికళ్యాణ కృత్ కశ్చిత్" దుర్గతింతాత గచ్ఛతి" (గీత 6వ అధ్యాయం) అనే గీతావాక్యాన్ని "యోగక్షేమం వహామ్యహం" అనే భగవంతుని ప్రతిజ్ఞను (గీత 9 - 22) ఆచరణలో చరితార్థం చేసి చూపించావు.

"రామతే అధిక రామ కరదాసా"

రామునికంటే రామభక్తుడే గొప్ప అని తులసీదాసన్నాడు. గట్టి శిష్యుడవు నేనె మెత్తనివాన్ని. నావు నాకంటే గట్టివాడివి. బాబూ నీ ఉద్యమం మూడు పువ్వులు ఆరు కాయలుగా వికాసం చెందుగాక, వర్ధిల్లుగాక, ఏడు కొండల ప్రభువు నీకు సదా ఏడుగడయగును గాక.

రామ కథ ఎందరెన్నివిధాల వర్ణిస్తే దాని వాసికి తక్కువా? అని కంకంటి పాపరాజన్నాడు; గీతను బహు రుచులతో త్రాగి, త్రాగి, యెందరెంత త్రాగినా అఘత్యాగం అజ్ఞానత్యాగం, ఆది దేవునితో యోగం, సంయోగం, సంయోగసిద్ధం, గీతాచార్యుని అనుగ్రహము. గీతామాత ఆశీర్వాదము, సదా నీకులభించుగాక అని, రామ కథను పై విధముగా ప్రశంశించియున్నారు. తథాస్తు, శుభమస్తు.

శ్రీరామకృష్ణానంద స్వాముల వారు గీతావాణి సంపాదకులు, ప్రచారకులు, శ్రీ భూమానందాశ్రమము, గండిక్షేత్రము, వీరన్నగట్టుపల్లి (పోసు) కడపజిల్లా, పులివెందుల (తాలూక) పిన్ - 516 330. ఆంధ్రప్రదేశ్

ఈ గ్రంధరచనకు సహాయములందించి తోడ్పడిన వారు:—

1) డి. నాగశిద్ధారెడ్డిగారు, ఓరియంటల్ కళాశాల మాజీ ప్రిన్సిపాల్

2) శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు, T.T.D. ధర్మప్రచార కార్యదర్శి
సంస్కృత శిరోమణి M.A.

3) యం. భాస్కరనాయుడు, నూనెవారిపల్లె అప్పర్ ప్రైమరీ స్కూల్
హెడ్మాస్టర్, మదనపల్లె

4) జి. సహదేవనాయుడు వారి రెండవ కుమారుడు మునిస్వామినాయుడు
బెంగుళూరు మదనపల్లె

5) మల్లెల గురవయ్యగారు, మదనపల్లి బి టి కళాశాల తెలుగు శాఖాధ్యక్షులు రీడర్, వీరు కావ్యమును సరిజూచి చక్కదిద్ది పీఠిక వ్రాసినవారు

6) మదనపల్లి మండల రెవిన్యూ అధికారి సురేంద్రబాబుగారు TTD వారు పంపిన మారిటీ పత్రమును ధ్రువీకరించి యిచ్చిన సహాయకులు

7) శ్రీ పి. పార్ధసారధిగారు, ప్రస్తుతం చింతపర్తి ఉన్నత పాఠశాలలో సీనియర్ తెలుగు పండితులు నా శ్రేయస్సు కొరకు అహర్నిశలు పాటుబడినవారు

8) యల్. రామమూర్తినాయుడుగారు, వాటర్ షెడ్ కార్యదర్శిగారు

9) యల్ వెంకటేశ్వరరావు, తెలుగు పండిట్, ఆధునిక పద్ధతిలో ఈ గ్రంధమునకు పీఠిక వ్రాసినవారు బి విద్వాన్ తెలుగు

10) డాక్టర్, సహస్రావధాన చక్రవర్తి ఇంకా ఎన్నో బిరుదములుగల . మేడసాని మోహన్‌నాయుడుగారు, ప్రస్తుత అన్నమాచార్య కళామందిర ఛైర్మెన్ ఆచార్య బిరుదాంకితులు.

ఆర్థికముగా గ్రంధరచనకు తోడ్పడినవారు —

1] తిరుమల-తిరుపతి దేవస్థానం ఇ ఓ తోసహా అందరి సహకారం,
ఆర్థిక సహాయం T.T.D. దేవస్థానంవారు

2] జోగుల దాసయ్య, మాజీ టీచర్ వెంకటేశ్వర నగర్ 116-00

3] టీచర్ పుల్లయ్యగారు, నీరుగట్టుపల్లి మదనపల్లి 116-00

4] రిటైర్డు టీచర్ బి మహదేవశర్మగారు పెద్దతిప్పసముద్రం 58-00

5] రామకృష్ణయ్యగారు, ప్రస్తుత పాకాల సహకారబ్యాంక్ సూపర్వైజర్
తిరుపతి [illegible]8.00

పై వారందరికీ నా కృతజ్ఞతలు

ముద్రిత గ్రంధములు :—

1) 1985లో శ్రీమద్భగవద్గీత మూల శ్లోకములకు భావానువాదము చేసి "తోహర గేయములు" అను పేరుతో T.T.D. దేవస్థానము వారి ఆర్థిక సహాయముతో 1000 ప్రతులను ముద్రించియున్నాను

2) ఇపుడు "శ్రీ రా మ ద్వి శ తి" అను గ్రంథమును శ్రీ T. T. D. వారి ఆర్థిక సహాయముతోనే 2000 ప్రతులు ముద్రించియున్నాను

ఆ ము ద్రి త గ్రం థ ము లు :—

1] శ్రీ తిరుమలేశ శతకము సీస పద్యములు
2] అహింసా పరమోధర్మః మాంసాహారము మంచి చెడులను గూర్చి
3] రావణ రాజ్యము, రామరాజ్యము వచన రచన
4] గోవింద నామములు దశావతారముల కథగలసి వచ్చే విధముగా
5] ఖండ రచనలు కాలాను గుణ్యముగా
6] గజేంద్ర మోక్షము తోహార గేయములు

గౌరవనీయులు 3 - 4 97 తిరుపతి

శ్రీయుతులు సహస్రావధాన సాహితీఅవధాన చక్రవర్తి. డాక్టర్, ఆచార్య మేడసాని మోహన నాయుడుగారు అన్నమాచార్య, ప్రాజక్టు డైరక్టర్ గారు అభిప్రాయము

ఓబయనాయుడుగారిని, నేనిరువదిసంవత్సరములుగా, ఎరిగియున్నాను మేమిరువురము అక్కడక్కడ ఆశ్రమముల వద్ద, ఒకేవేదికపై, వేదాంతోపన్యాసము లిచ్చియున్నాము.

ప్రస్తుతము వారురచించియున్న ''శ్రీరామ ద్విశతి'' అను గ్రంథమును చదివి పరిశీలించినాను అందులో శ్రీరామచంద్రుడేదైవము. యనుదృఢ నిశ్చయమును సముచితముగా, చక్కగావి శ్లేశించియున్నారు. అయా పాత్రల అంతరంగమును. రసోచితముగా నావిష్కరించినారు. ఉపన్యాసాలలో వీరిప్రసన్నగళం, కవనహేల లో వీరికలం ఈరెండూదర్శించేభాగ్యం నాకుకలిగింది — ధన్యోస్మి

క. ఓబయ నాయకోత్తమ
ధీబల సంభూత రామా. దేవకథావాక్
ప్రాబల్య కలనసుందర
మై. బుద్ధి పథంబునకు రసానుభవ మిడున్

క. శ్రీరాముని దైవత్వం
బారాధ్యంబగుట. సత్యమై దృఢలీలా
ధారం ధర్యశుభప్రదత
మై, రహియించుట వచించె నాహెూయనగన్

క, శ్రీరాముని బాణంబున
ధారా మహిమంబులెల్ల దనరినగతి. వి
స్ఫారనవోదయవేగో
దారంబై తెలుగుతల్లి తాబులకించెన్

# ముందుమాట

"ప్రపంచాని కంతటికీ భారతదేశం గురువు" అన్నాడు స్వామి వివేకానంద ప్రపంచమంతా భోగభూమి, భారతదేశం త్యాగభూమి ప్రపంచ దేశాలన్నీ నాగరికత తెలీకుండా ఆదిమానవులుగా ఉండిన రోజులలోనే భారతదేశము మహోన్నతమైన నాగరికతతో షట్చక్రవర్తులు షోడశ మహారాజుల పరిపాలన స్వర్ణయుగాలననుభవించింది. ఆ ప్రాచీనకాలం నుండి ఈ ఆధునికకాలం వరకు ప్రపంచ ప్రజలందరి దృష్టిలో భారతదేశానికి ఒక ప్రత్యేక గౌరవము స్థానం. ఉన్నాయి.

అయితే భారతదేశానికి అంత మహోన్నత స్థానం కలగడానికి మూలకార కులెవరు? ఒక 'రాముడు' ఒక "కృష్ణుడు" వారి ప్రవర్తన వారి బోధనా వీటిని ఆసరాగా తీసుకుంది. భారతదేశం ఆ మార్గాలను అనుసరించి భారత దేశం అందుకే ప్రపంచ దేశాలకు భారతదేశం గురువు.

భారతవీరుడు ధీరోదాత్తుడు శ్రీరామచంద్రుడు ఒకేమాట, ఒకే బాణము, ఒకే పత్ని ఇదె రామనియమం. అందుకే ఈ శ్రీరామ ద్విశతి అంతా రామ మయం,

ఇందులో రామకథ కంటేకూడా రామ స్వభావాన్ని రాముని భావనా ప్రపంచాన్ని తనమనోనేత్రంతో చూచి, మనకూ చూపటానికే అధిక ప్రాధాన్యత నిచ్చారు. గ్రంథకర్త

అంతేగాక. ఒక సగటు వ్యక్తి ప్రపంచం నుండి ఎదురుదెబ్బలుతిని క్రమముగా దైవం వైపు మరలడాన్ని జిజ్ఞాసువు కావడాన్ని, జ్ఞానం సంపాదించడాన్ని. తుదకు మోక్ష సామ్రాజ్యం చేరుకోవడాన్ని అద్భుతంగా చిత్రించారు గ్రంథకర్త.

ఇక్కడ రచయిత అందరిలాగా రామకథను, గుణగణాలను, మనస్సును అభివర్ణించి ఆగిపోలేదు.

"పాఠకులను అర్థంకాని వేదాంతం లోకి నెట్టేసి చేతులుదులుపుకోలేదు,
విభిన్నశైలిలో, సరిక్రొత్త ప్రపంచాలు దర్శించి మనకళ్ళముందుంచారు.
ఆ తరువాత నిలవక మనకూ ఆలోచించే పని పెట్టారు,

మనం రాముని ఆదర్శంగా తీసుకొని పూజిస్తున్నాం. పుణ్యలోకాలు సాధించుకుంటున్నాం అయితే దీనికి మూలాధారం ఎవరు? రాముడేనా? కాదు, 'రాముడే మూల విరాట్టు. ఆ మూలవిరాట్ పైకి దృష్టిని మరలింపజేసిన వారెవరు?

ఆ మూలవిరాట్టును ప్రజలందరికి అందుబాటులోకి తెచ్చినవారెవరు?

"రావణుడు. కైకేయి, మంథర" ఈ ముగ్గురూ రాముని జీవితానికి ప్రధాన మార్గదర్శకులు వీరులేకపోతే రాముడేలేడు. రామకథే లేదు.

సేతువేద్చి, కష్టించి అందర్నీకొట్టి, తానూ తన్నులు తిని లోకాలను తలక్రిందులు చేసి చివరకు "అలవైకుంఠపురంబులో నగరిలో సామూల సౌధంబుదాపల" విలసిల్లి శ్రీమన్నారాయణునీ ఈ లోకానికిదించుకొచ్చినవాడు రావణ బ్రహ్మ .... అవును .. రాముని తెచ్చినవాడు రావణుడే.

రావణుడు మూర్ఖుడుకాడు, మహాజ్ఞాని... నాస్తికుడుకాడు. పరమ భక్తుడు... జన్మత; వచ్చిన క్రౌర్యం కాస్త వున్నా?.... అతని దృక్పథం ప్రగతిశీలకం, ఇతని పరమాశయం....లోక కళ్యాణం..

ఇలా సునిశితమయిన ఆలోచనా ధోరణి ఈగ్రంథం నిండుగా నిబిడీకృతమై .. కనబడుతుంది.

రాముడు అయోధ్యలో పుట్టాడు. ఆ ప్రాంతం పావనం—మరి దక్షిణ భారతం గతి?....

అయన పట్టాభిషేకం చెడగొట్టయినా సరే— దక్షిణ భారతం పునీతం చేయడానికి రాముని అరణ్యం పంపారు. ....కైకేయి, మంథర

రచయిత, మాటల్లో చెప్పాలంటే ...ఇది కైకేయి. మంథర కలిసి "దక్షిణ భారతదేశమునకిడిన దక్షిణ" అందుకే మనం "వారికి లెంకాయ గొట్టవలె"

"ఆఫ్రికా చీకటిఖండం" అని చదువుకుంటాం మనం గుడ్డిగా భారత దేశానికిఈజిప్టులాంటి దేశాలతో వేలసంత్సరాలకుముందే వ్యాపారసంబంధాలున్నాయి ....మరిఇది చీకటిఖండం ఎలాఅయింది? ఇదిఇంగ్లీషువారికి చీకటీ ఖండం

సంకుచిత దృక్పథంతో కొందరు రాసినప్రాచీనచారిత్రకఅవాస్తవ పరిస్థితులను చదువుకుని ఆదేచరిత్రఅనుకుని తందానతాన అంటున్నాం.

అదేక్రమంలోనే భారతదేశరాజరిక వ్యవస్థను కూడా నిరంకుశంగా చిత్రించారు మెకాలే లాంటి చిత్రకారులు,

"పిల్లి కళ్ళుమూసుకుని పాలుతాగుతూ తననెవరూచూడదని అనుకుంటుందట"

అలాంటి ఈచరిత్రకారులు కేవలంమనచుట్టూ జరిగేదాన్నిసరాగాల

తీసుకొని వివిధ దేశాల స్థితి గతులను ఊహిస్తూ కొంత ఉద్దేశాపూర్వకంగా కొంతవాస్తవాలను వక్రీకరిస్తూ చరిత్రను తయారు చేశారు.

తమదేశంలో సర్వాధికారాలూ కేంద్రీకరించుకున్న నిరంకుశ రాజరిక వ్యవస్థవుండింది కనుక భారతదేశంలో కూడా రాచరికం నిరంకుశంగా వుండొచ్చని నిజాయించారు వారు

వారి నీడలు పడ్డాక ఒకరిద్దరు నిరంకుశులై ఉండొచ్చు, నిజానికి "భారతరాచరిక వ్యవస్థ ఎంతమాత్రమూ నిరంకుశము కాదు"

దీనికి ప్రధాన ఉదాహరణ శ్రీ రా మ చ ం ద్రు డే

శ్రీరాముని రామాయణం కథానాయకునిగా చూపుతుంది, ఈగ్రంథం రాముని పితృవాక్య పరిపాలకునిగా ప్రజావాక్య పరిపాలకునిగా రాజ్యాంగ నిబద్ధత కలిగినవ్యక్తిగా మనముందుంచుతుంది.

ఒక రాజకీయ నాయకునిగా నిర్మలహృదయునిగా చూపుతుంది "రామరాజ్యమనుచు రాత్రింబవళ్ళను కలవరించినారు గాంధిగారు"

భారతదేశానికి పరాయిపాలననుండి దాస్యవిముక్తిచేసి పెట్టింది గాంధేయవాదం.

ఆగాంధేయవాదానికి మూలపురుషుడు శ్రీరామచంద్రుడే. గాంధి జీవితమంతా రామునిఆదర్శాలమయం చివరకు ఆయనమరణం కూడా రామమయమే

నేడు ఇంతఅభివృద్ధి చెందినాక మనలోఏర్పడిన ఆధునిక భావాలను ఏవాటవస్తే ఆయన శ్రీరాముని మనోభావాలనుపోల్చితే రాముని భావాలు మనభావాలకంటే ఇంకా ఎన్నోరెట్లు అత్యంతాధునిక భావాలని తెలుసుకోవచ్చు అనాదే కుటుంబ నియంత్రణ పాటించాడాయన

ప్రజలపై పూర్తిబాధ్యత రాజుదే ప్రజలకు ఏకష్టం కలిగినా రాజే కారకుడౌతాడు అదుంకే ప్రజాభిప్రాయం ప్రకారం రాజునుఎన్నుకొంటున్నాం

"ఇది ప్రజాస్వామ్యం" ఇక్కడ ప్రజాస్వామ్యం అయిదేళ్ళకు ఒకసారి బయట కనబడుతుంది తరువాత ప్రజలప్రమేయం సున్నా,

"రామునిపాలనలో ప్రతినిత్యమూ ప్రజాస్వామ్యమే"

"ప్రతిరోజూ ప్రజాభిప్రాయాన్ని బట్టే పరిపాలన జరిగింది"

ఇలా ఈరచనలో నిబద్ధత కలిగిన రాజకీయనాయకుని రామునిలో మనకు చూపారు రచయిత మీకు వాస్తవాలను స్వీకరించగల సహృదయత రామునంతటి వాడిని అనుసరించగల శక్తి రావణునికైకేయిని, మంథరనూ అర్థం చేసుకోగల ఆత్మధైర్యం ఉంటే ఈపుస్తకం చదవండి చూద్దాం,

విద్వాన్ లంకిపల్లె వేంకటేశ్వరరావు

28 - 4 - 97

ఓం శ్రీ గణేశ శారదా గురుభ్యోనమః

"ఓం నమో భగవతే శ్రీరామచంద్రాయ"

క. శ్రీ, వాణి, గౌరి, గణపతి,
నావాగ్గుణ కర్మములను నలరించుటకున్
భావమున దలతు సద్గురు
దేవుని భవహరుని దేవ దేవ దావాధిపదన్ 1

క. శ్రీకర దశరథరామా
నీకును పూజలనొనర్చి, నీ నామంబున్
ప్రాకటముగ జపియింపగ
నాకిక దృఢదీక్షనిమ్ము, నా శ్రీరామా 2

క. ఎన్నో జన్మలనెత్తియు
నిన్నున్ దలుపంగలేక, నీరసపడుచున్
ఖిన్నుడనై మరణించుచు
నున్నాడను నన్నుగావు మున్వినిరామా 3

క నీవొసగిన వేషంబులు
నే వేయుచున్నవాడ, నిలకడలేకే
భావలయంబున నటనలు
గావించుచు కాలమిటుల గడిపితి రామా 4

క అందరు నావారనుచున్
మందుడనై తెలియలేక, మాయకులోనై
యందరి బుద్ధులగనుగొని
తొందరగా మాయనిపుడు, దొరగితి రామా 5

క. మాయకు లోబడకుంకను
మాయాపతివైన నిన్ను, మరువక నేనున్
సేయుదు జీవన యాతర
పాయను నీ నామ స్మరణ, ప్రభు శ్రీరామా 6

క. మంచిపని జేతునింకను
మంచికి ధనమొసగిననేను మంచివారి భా
వించియు స్నేహమొనర్చెద
వంచకులను జేరనింక, వనదుగ రామా! 7

క. చెడుపని జేయుచునుండిన
చెడుపనులకు ధనమొసంగి చెడు కార్యంబుల్
విడువక సేయుచునుండిన
తడయక నది చేటుదెచ్చు తప్పక రామా! 8

క. లోకులు మెచ్చగవలెనని
పోకడలున్బోయి పోయి పొరబాటునతా
దూకుడు తనమును జూపుచు
వాకొను వారలకు చేటువచ్చును రామా! 9

క. తెలియక నెన్నోమాటలు
పలు విధముల నాడుచుండుౘ పాపంబనకన్
తెలిసికొనిరేని మరలన్
విలపింతురు పాపములకు వెఱచియు రామా! 10

క. నేనొక సమయమునందున
దీనుడనై గురువుకడకు, దిగులున బోవన్
ననుజూచి గురువుగారిటు
వినిపింపన్గోరె నాదు వేదన రామా! 11

వ॥ నేనపుడు గురువుగారితో నిట్లు విన్నవించుకొంటిని. స్వామీ నాకెందుకో మరణించువారిని జూడగా, మనసున కనేక మరువరాని సందేహములు గల్గుచున్నవి. చెప్పెదను వినుమని చెప్పనారంభించితిని

స్వామీ! మానవులును, ఇతర జంతువులు కూడ ఈ భూమిమీద పుట్టి కొంతకాలము జీవించి మరణించుచున్నవి. అట్లుమరణించుదానికి ప్రాణము పోయినది ప్రాణము పోయినదని శవమును కాల్చివేయడమో పూడ్చివేయుడమో గావించుచున్నారు. మరి ఆ దేహంలోనుండిన ప్రాణమేమైనట్లు? ఎక్కడికి పోయినట్లు? అని నేను గురువుగారిని ప్రశ్నించితిని. వారిట్లు సమాధానమొసగిరి నాయనా నీవిపుడు మంచి ప్రశ్నే వేసితివి. దీనిని సర్వులు తెలిసి

కొని, ఇకమీదట ఏవిధముగా తాము మెలతవలెనో, ఈ జీవుడు దేహమునుండి వెలువడిన తరువాత తానెక్కడికి వెళ్ళుచున్నాడో! తెలుపుచున్నాను. శ్రద్ధగా వినుమని చెప్పదొడంగెను.

మరణించిన జీవులు నాల్గు రకములుగా విభజింపబడుచున్నారు ఈ లోకంలో పాపం జేసినవారు మరణించిన తరువాత యమ పట్టణానికి బోయి అతని పాప.పుణ్యములను విచారింపబడి అతడు పాపములు జేసినవాడైనచో అతని పాపమునకు తగిన శిక్ష విధింపబడి,ఆ శిక్షకు తగిన నరకమునకు బంపి అతని పాపము తరిగి, తిరిగి పునీతుడైన తరువాత, మరలా ఈ భూలోకంలో దరిద్రుడుగా బుట్టడం పాపాలు జేయడం,మరణించి యమలోకానికి బోవడం మరలా రావడం, పుట్టడం ఇదే తంతు. రెండవ రకంవారు పుణ్యంజేసినవారు మరణించిన తరువాత స్వర్గలోకానికి బోయి. అచ్చట స్వర్గ సుఖాలనుభవించి తిరిగి భూలోకానికి రావడం, ధనవంతులుగా బుట్టి,మరలా పుణ్యం జేసి మర ణించడం, స్వర్గానికి బోవడం, తిరిగి రావడం, ఇది వీరి పని. మరలా ఒక రకం వారు అధిక పాపాలు జేసి ఈ లోకంలోనే క్రిమికీటకాలుగా పుట్టడం చెట్లు చేమలుగా పుట్టడం ఇది వీరి పని ఇక నాలుగవ రకంవారు భక్తులు జ్ఞానులు. వారు భగవద్భక్తిగలవారై యుండి మరణానంతరం భగవంతునిలో లీనం గావడం లేదా శివలోకంలోనో, వైకుంఠములనో ముక్తులై చేరిపోవడం అక్కడనుండియే ముక్తిబొందడం. వారికిక ఈ లోకంలో జన్మించవలసిన పని లేదు.అందువలన వారే ముక్తులు.ఆ ముక్తికొరకే సర్వజీవులు ప్రయత్నించు చున్నారు. ఇంతకు ఈ జీవుడెవరోకాదు భగవంతుని యంశమే యైనందున మరల భగవంతునిలో చేరేవరకు మానవప్రయత్నం ఎడతెగకశ్రద్ధతోచేయాలి ఇదీ మరణించిన జీవుల చరిత్ర.

క. పుట్టుక చావుల నడుమను
కొట్టుకలాడుచును జీవకోటులు నిటులన్
కట్టడి వలయము లోబడి
నిట్టూర్పులు విడుచుచుండు నిజముగ రామా! 15

క. ఈ సుడిగుండము నుండియు
దీసియు నీవలకు నన్ను, దెలిపియు త్రోవన్
గాసిని జెందక శాశ్వత
వాసపు మార్గంబుజూప, వలసితి రామా! 16

క. గురుసాన్నిధ్యము జేరియు
దరిజేర్చుము స్వామి మీకు దాసుఁడననుచున్
గురు కరుణ బడయుటకునే
శరణంబును వేడ గురుఁడు, చతురత రామా! 17

క. జీవరహస్యము దెల్పియు
నీవిక నేజెప్పినటుల, నిశ్చలమతివై
భావించి జీవయాత్రను
సేవింపుము రాముననుచు, జెప్పెను రామా! 18

క దేవుని యంశము నీవనె
దేవునిలో నుండకుంత, తెగి పడి యెటులో
భూవలయంబున పుట్టుక
చావులలో నుంటిననియె, సద్గురు రామా! 19

క. దేవుడె జీవుండయ్యెను
జీవుడె దేవుఁడుగ మార్పు జెందంగవలయున్
జీవత్వంబున నుండియు
దేవత్వము జెందుకిటుకు, తెలిపెను రామా! 20

క సాలోకము, సామీప్యము
చాలగ సాన్నిధ్యముక్తి సద్గురు కరుణన్
మేలగు సాయుజ్యముచే
నాలుగు ముక్తులు నగ్గునాడిక రామా! 21

క. జీవుడు దేవుండగుచున్
జీవత్వము సమయన తఁడుచి ద్రూపుఁడగా
పావన బ్రహ్మము తానై
చావును పుట్టుకననతఁడు చంపెను రామా! 22

క. సారూప్యము సాలోక్యము
చేరియు సాన్నిధ్యముక్తి జెందిన పిదపన్
వారిక సాయుజ్యంబును
నారాయణ లీనముక్తి నమరుదురు రామా! 23

క. ఈ విధి దేవుఁడు జీవుడు
గావచ్చియు గురువు, కరుణ గల్గినకతనన్
దేవుండయ్యెడు వరకున్
భావిడక భక్తి సలుప, తగు శ్రీరామా! 24

క. దేవుని యంశమునీవనె
దేవునిలో నుంతకుండ, తెగిపడి యెటులో
భూవలయంబున బుట్టుచు
చావులలో నుంటివనియె, సద్గురు రామా! 25

వ॥ ఈవిధముగా జీవత్వముతో నెంత కాలము నుండి చావు పుట్టుకలలో తగుల్కొని యున్నానని గురువుగారినడుగగా వారిట్లు సమాధానము చెప్పియుండిరి.

క. కోటుల యుగములు గడచెను
కోటుల జన్మములు గడచె, దురటన్ బడకే
నేటికి గురుదయ గల్గెను
మాటికి యమ దర్శనంబు, మానెను రామా! 26

క. ఎనుబది నాలుగు లక్షల
తనువులలో బుట్టిపుట్టి, తహతహ పడగా
నను కరుణించిన దేవుడు
మనుజునిగా బుట్టజేసె మాధవరామా! 27

క. ఏ పూరికి బోకుండిన
బోవలయును యమపురంబు, పుట్టిన జీవుల్
గావున నందరు తమకగు
చావును యమపురము మఱవజనునే రామా! 28

వ॥ మనుష్యుని ప్రాణము బోవునప్పుడు యమభటులా శరీరమునుండి జీవుని వెలికి లాగెదరు. తరువాత 96 నిముషములలో ఆకాశ మార్గమున యమపురమునకు దీసుకపోయి. యమధర్మరాజు నెదుట హాజరు పరచి మరల భూలోకమునకు జేర్చి జీవునిశరీరముండుప్రాంతమునకు దీసుక వచ్చి, శరీరము లోనికి పోనీయక, పట్టుకొనియుండెదరట. అతని (దహన) లేక ఖనన క్రియలైన తరువాత, పిండప్రసాదాది కర్మలు జరిగేవరకు అతడు మరణించిన ప్రాంతములోనుంచి, కర్మక్రియలు పూర్తికాగానే, యమభటులాజీవుని, కొట్టుచు, తిట్టుచు, యమ పట్టణమునకు బోవు త్రోవను పండ్రెండు మజిలీలుగా విభజించి, నెలకొక మజిలీలో నిలిపి, విశ్రాంతి యిచ్చుచు ఇట్లొక సంవత్సరమునకు జేర్చెదరట. యమధర్మరాజు చిత్రగుప్తునితోగి తెలిసికొని జీవుని పాప పుణ్యముననుసరించి శిక్షలు వేయించు

నట. అందువలన మనుష్యుడు బ్రతికియున్నప్పుడే ఈ నరక బాధలను, యమ పట్టణమును స్వర్గమును మరువక, చెడుపనులను జేయక, మంచి పనులు జేయుచు భగవద్భక్తుడై మెలగి జనన మరణము లేని ముక్తిని సంపాదించవలయును.

క. యమధర్మరాజు మనకున్
గమనింపగ క్రొత్తగాదు, కడుపరిచితుడే
సమయంబుజూచి పిలువగ
క్రమముగ జీవులును బోయి కనవలె రామా! 29

క. పోయిన జీవుల చరితము
పాయక యా చిత్రగుప్త పఠనము సేయున్
న్యాయమధర్ముడు వినియున్
వేయించును శిక్షలితని, వేగమె రామా! 30

క కావున మరలా యమపురి
బోవలయునటన్న యెటుల పోయెద మహహా
నీవేదిక్కని దేవుని
భావింపుమటంచుగురుడు, బల్కెను రామా! 31

వ. గురువుగారిట్లు మరణ విషయంబును దానిని వారణోపాయంబును దెలియబరచి, దానికుదాహరణముగా వాల్మీకి కథను దెలియబరచెను

## వాల్మీకి చరిత్ర

క. దారినబోవుచునుండెడు
వారిని రత్నాకరుండు, వధియించియు తా
వారి ధనంబులగైకొని
దారాపుత్రులను బెంచెదశరథ రామా! 32

క. నారదుడదిగనియాతని
వారించియు వానిమంచి, వానిగజేయన్
జేరిహితబోధజేయగ
మారెనురత్నాకరుండు మంచిగ రామా! 33

క. ఘోరంబగు నాపాపము
ధారుణి లో కొండలటుల దట్టంబైతా
పేరుకొనియున్నవన్నియు
నేరములని దెలిసికొనెను, నిజముగ రామా! 34

క. ఆ పాపంబుల నుండియు
కాపాడుము స్వామియనుచు. కడు వినయముతో
వాపోయి నారదుఁ గని
నీ పాదము విడువననుచు, నేడ్చెను రామా! 35

క అని యేడ్చెడు రత్నాకరు
గనుగొని నారదుడు చాల, కరుణాన్వితుడై
వినురత్నాకర నీకొక
ఘన మంత్రముజెప్పువాడ, క్రమమునె రామా! 36

క దానిని విడువకనీవున్
ధ్యానంబును జపముజేయ, దానిమహిమతో
నానావిధ పాపంబుల
మానకతాగాల్చివైచు, మంత్రము రామా! 37

క అని మంత్రమహిమదెలిపియు
వినిపించెను రామ యనెడు, విధిమంత్రంబున్
పనిబూని పలుకుమన నా
తని నాలుకదిరుగదయ్యె, నగనుత రామా! 38

క. అతడు జేసిన పాపము
ప్రీతిగ శ్రీరామ యనుచు బిలువగ తిరుగకన్
నాతని నాలుకజడమై
చేతనమును లేకయుండె, శ్రీ రఘురామా! 39

క. నారదుడదిగని వెంటనే
మారిచి శ్రీరామయనెడు, మంత్రాక్షరములో
మారా మారా యనుచును
మారా యని త్రిప్పినేర్పె, మంత్రము రామా! [illegible]

క. మారాయను మంత్రంబును
వారక ప్రాచేతనుండు. వనరుగజపమున్
పారాయణ గావింపగ
ఘోరంబగుపాపరాశి గూలెను రామా! 41

క. పాపము ప్రక్షాళనమై
తాపసి వాల్మీకియనగ ధాతయునతనిన్
నేపార రామచరితము
చేపట్టి రచింపనాజ్ఞ జేసెను రామా! 42

క. కమలజుని యాజ్ఞ చొప్పున
కమనీయంబైనరామ. కథ వ్రాసియు తా
వములుండునాదికవియై
నీ మంత్రపు మహిమ దెలిపెనెర్పున రామా! 43

క. పాపము గలవారైనను
శాపంబులననుభవించు శతజనులైనన్॥
ప్రాపించి మిమ్ము దలచిన
తాపంబులడంగిపోవు తప్పక రామా! 44

వ॥ కృతయుగాంతమున రావణుడను రాక్షసుడు దుర్మార్గుడై స్వర్గ, మర్త్య, పాతాళాది లోకములందుండు గల వారందరిని జయించి సూర్య, చంద్రాది, గ్రహ. నక్షత్రమండలములను మించి శాసించుచుండెను అందువలన బ్రహ్మాది దేవతలు వైకుంఠమునకు బోయి, ఆదినారాయణు నవలోకించి, రావణునివలన తమకుగలుగు బాధలను జెప్పుకొనగా, విష్ణుదేవుడు వారికభయమొసంగి నేను నరుడుగాను. మీరు వానరులుగాను పుట్టి. వానిని సంహరించవలెను. అని వారిని పంపివేయ అందరును, అప్రయత్నము సేయుచుండిరి

క రావణు బాధల కోర్వక
పావన వైకుంఠమునకు. బ్రహ్మాది సురుల్
జీవము నిలుపదు మాకిక
కావుము మమ్మనుచు హరిని. గలిసిరి రామా! 45

క వారిని శ్రీహరి గాంచియు
నేరఘురాముండనగుచు, నినకులమందునన్
కూరిమి దశరథసుతుడై
వారక జనియింతుననియె, వరగుణ రామా! 46

క. మీరును వానర రూపుల
ధారుణిపై జననమొంది. తప్పక నాతో
చేరిననందరమున్ జని
క్రూరునిజంపెద మటంచు, కోరెను రామా! 47

వ॥ ఓ దేవాది మునీంద్రులారా వినండి. రావణుడు, అహంకారపూరితుడై నరులను వానరులను. తిరస్కార భావముతోనే. బ్రహ్మదేవుని వరమడుగక మనుష్యులు రాక్షసులకాహారముగా గలవారు ఇక వానరులు కొమ్మల మీద దిరుగుచు కాయగసరులుదిని జీవించెడువారు. నాయ తటివాడు వీరి వలన చావులేనట్లు వరమడుగుట నా యంతస్తునకు తగనిపనియని వదలివైచెను. అందువలన మనమిపుడు నరులు, వానరులుగా జన్మించి, ఆకఱకు రాక్షసుని కడతేర్చెదము కదలండి భూలోకంబునకని. విష్ణుదేవుడాజ్ఞాపించెను ఆయాజ్ఞ నందరును శిరసావహించిరి.

క. నరవానరులననాకున్
బరికింపగ సమముగాదు బవరములందున్
వరమేలగోరవలెనని,
గరువము రావణునికిటుల, గల్గెను రామా! 48

క. అని నారాయణుడంపగ
జనియందురు భూమిమీద. జనియింపంగన్
పనిబూని విష్ణుదేవుడు
జనియించెను దశరథునకు, జానకిరామా! 49

క. భరతుడు శత్రుఘ్నుండును
సరసుతు లక్ష్మణుడు సీత, సౌజన్యనిధుల్
విరివిగ నీ కార్యములకు
ధరణిని జన్మించిరపుడు, దశరథరామా! 50

క. విశ్వామిత్ర వశిష్టులు
విశ్వాసముతోడ మీకు విద్యలు గరుపన్
విశ్వామిత్ర వశిష్టుల
విశ్వాసముగల్గె మీకు, విరివిగ రామా! 51

క. మునియాగము రక్షింపగ
మునివెంటను మీరుబోవ, మునుకొని యెదుటన్
ఘనబాహు బలముతోడను
చనుదెంచెను తాటకపుడు, జనమతరామా! 52

క. ఆతాటికి నెదిరించియు
చేతను బాణంబుదీసి, శీఘ్రమువేయున్
భూతనమునబడి రాకసి
కూతలు బెట్టుచు జచ్చె, గుణనిధి రామా! 53

క. అంతట విశ్వామిత్రుడు
సంతసమున యజ్ఞమపుడు, సరగునజేయున్
వింతగ మారీచాదులు
పంతంబున దాని జరుప పగగొని రామా! 54

క. జనుదెంచి రక్తమాంసము
ఘనముగ గురిపింపజూచి, కడుకోపముతో
తన బాణంబుచు వేయగ
వెనువెంట సుబాహుడీల్గె, వెడలిరి రామా! 55

క. యాగము నిర్విఘ్నముగా
బాగుగ నెరవేరజూచి, బ్రహ్మర్షియుతా
సాగుచుమిథులకు మిమ్మున్
సాగించెను నడవిలోన. సరసత రామా! 56

క. పాపాలు జేసి గౌతము
శాపంబున రాయియగుచు, చలనములేకే
తాపడియున్న నహల్యకు
నీ పాదము శాపముక్తి. నెరపెను రామా! 57

క. జనకుని కొలువునకొన్ జని
జనవర్యులుజూచుచుండ, జగములు బొగడన్
జనకుని శివుచాపంబును
ఘనముగ నెక్కిడియు విఱువ గల్గిన రామా! 58

క. భూసుతను పెండ్లియాడియు
కోసలకున్ మీరుబోవ, కోపముతోడన్
భూసురుడు పరశురాముడు
రోసముతో నెదురునిలిచి రోజుచురామా! 59

క. శివచాపంబును విఱచియు
నవమానమొనర్చినావు, నాచార్యునకున్
నీవిపుడు దీని విఱువుము
భవదీయ పరాక్రమంబు, బయలగు రామా! 60

క. అని తన చాపంబీయగ
కొనకొపును రాముడపుడు గొనియాతనియం
దనగిన విద్యలు బలమును
వెనువెంటనే లాగుకొనగ, విప్రుడురామా! 61

వ॥ ఇట్లు శ్రీరామచంద్రుడు పరశురాముని చేతనున్న ధనస్సునొకవైపున దీసికొని ఆ ధనస్సునుండి, పరశురామునిలోగల బలమును, విద్యలను తన లోనికి లాగుకొనెను. పరశురాముడు బలహీనుడై శ్రీరామునితో నిట్లనెను.

క నాయంశమె నీ యంశము
నాయందున్నట్టి బలము, నాదగు విద్యల్
నీ యంశమందె చేరెను
పోయెద తపమునకటంచుం బోయెను రామా! 62

క. మీరును నయోధ్యజేరియు
కూరిమి భార్యలనుగూడి, కుశలతనుండున్
వారలు మిమ్ములరింపన్
వారికి కాలంబుగడిచె, వనరుగ రామా! 63

క. నీకున్ బట్టము గట్టెద
చేకొనుమని తండ్రిబిలిచి, చెప్పినవేళన్
నీకుక్ వనవాసంబిదె
చేకొనుమని కైకతల్లిం జెప్పెను రామా! 64

క. పట్టము గట్టెదనన్నను
నట్టడవులలోనికిపుడు, నడువుమటన్నన్
దిట్టంబగు నీ చిత్తము
నట్టిట్లాడదయ్యె, హరి శ్రీరామా! 65

క. దక్షిణ భారతదేశము
ప్రక్షాళన మొందమీదు పాదస్పర్శన్
వీక్షింప కైకమందర
దక్షిణ దేశమునకిడిన, దక్షిణరామా! 65

క. వారిరువురి పన్నాగము
వారక మీరడవులకును, వచ్చెడి విధమున్
కారణమయ్యెను గావున
వారికి టెంకాయగొట్టవలె శ్రీరామా! 67

క. అడవులకు మీరు వెడలియు
వడివడిగాబోయిగుహుని, వాసముజేరన్
అడుగులు గడిగియునాతడు
వెడలించెను నదినిదాటి, వేగమెరామా! 08

క. నదిదాటించిన గుహ్యునిన్
సదయత సంసారనదిని, సాంతముగానన్
పదిలంబుగ దాటి చితి
విదినీదగు కరుణగాదె? విభుశ్రీరామా! 69

క. మునులాశ్రమముల దిరుగుచు
మునివరులాశీర్వదింప, మోదముతోడన్
వినయమున వారి గొలుచుచు
తనియించియు, వారివలన దనిసినరామా! 70

క మీరున్ దారినపోవగ
క్రూరకుండు విరాధుడనెడు, గుణహీనుండున్
నారీమణి సీతమ్మను
శూరతగొని యాకసంబు జొచ్చెనురామా! 71

క. అదిగనివాని శిరంబును
పదునగు బాణంబుతోడఁబడగొట్టితుదిన్
సదమల గరుడాంబుస్త్రన
సుదతిని జానకినిదింపి, సూక్ష్మతరామా! 72

క వానికి శాపము దీరగ
దానవ రూపంబువిడిచి, తనరూపమునన్
పూనియుమిమ్మున్ మ్రొక్కుచు
తానేగెను దివికి మిమ్ము దలచుచు రామా! 73

పంచవటిలన్ మీరుండగ
వంచకి శూర్పణఖ మిమ్ము. వరియింపగన్
మంచిగ కోసుక్కన్ చెవులును
త్రెంచగనదిలంకపతికి, దెలిపెను రామా! 74

ఖరదూషణులను వారలు
ఖరితెంచియు మిమ్మెదెర్చి, బలముగ బోరన్
పరివారంబును వారిని
బరిమార్చియు పౌరుషంబు, బరపినరామా! 75

శూర్పణఖ జెప్పగావిని
నేర్పునమారీచుబనిపి, నినుదూరముగా
జేర్పించి రావణుడుతా
మార్పించె సుమిత్రసుతుని, మాధవరామా! 76

మిము దూరముగాబంపియు
క్రమమునయతి రూపుడగుచు, గనిబడి సీతన్
తమకున్ భిక్షనొసంగెడు
సమయంబున గీతదాటి, సాధ్విని రామా! 77

గరుడుడు సర్పంబున్పలె
నురువడిగా సీతగొనుచు, నుడువీధిని తా
బరతెంచుచుండ నేడ్చెడు
ధరణీ సుతనపుడుజూచి, దశరథరామా! 78

అరుణుని కొడుకు జటాయువు
సరభసమున రావణునకు, సరగునయడ్డై
దురమొనరింపగ నాతని
విరివిగ రెక్కలను నఱికి వేసెను రామా! 79

రావణుడాకసమునగొని
పోవగ సీతమ్మతనదు, భూషణతతులన్
దావేసె హనుమదాదుల
పావన వానరుల మధ్య, బడశ్రీరామా! 80

పంకజముఖి సీతమ్మను
లంకకు రావణుడు జేర్చి రాక్షసస్త్రీలన్
పొంకముగ కాపుబెట్టియు
నుంచెన శోకంబుక్రింద, నొనరుగ రామా! 81

క. దండకవన మధ్యంబున
దండనమారీచుజేసి, తమ్ముని తోడన్
ముందుగ పంచవటింజని
సుందరి సీతమ్మలేమిఁజూచియు రామా! 82

క. మీరున్ సీతన్ వెదుకుచు
దారివ బోవంగనచట, తన చేతులతో
ఘోరకబంధుడు బట్టగ
వారక చేతులను నఱికి వైవగ రామా! 83

క. వానికి శాపము దొలగగ
పూనిక మిముసంస్తుతించి, పోయెన్ దివికిన్
దీనతనున్న జటాయువు
గానంబడె రామచంద్రు కనులకు రామా! 84

క. రావణుడు జానకిన్‌గొని
పోపంగాజూచి నేను పోరొనరింపన్
రావణుకరవాలంబును
వీవగనాఱెక్క విరిగె వేగమె రామా! 85

క. మీకీవార్తను దెలుపగ
నా కంఠమునందు ప్రాణ, నాడులు నిలిచెన్
నాకికముక్తి నొసంగుము
చేకొనుమని ప్రాణమొదలె శ్రీరఘురామా! 86

క. తనకొరకై మరణించిన
ఘనుడు జటాయువునకపుడు, కడు దయతోడన్
దనరూపము కినొసగియు
పనివడితా దహనక్రియలు బరపిన రామా! 87

క. పంపా సరస్సుగట్టున
సొంపలరగమీరుదిరుగ, సుగ్రీవుండున్
బంపగ సంజన సూనుడు
గొంపోయెను ఋష్యమూక కొండకు రామా! 88

క. శ్రీరాముడు సుగ్రీవుడు
కూరిమితో మిత్రులగుచు, కుజనుడు వాలిన్
శ్రీరాముడు వధియించియు
వారికి కిష్కిందనిడెను వనరుగ రామా! 89

క. వానరులను సుగ్రీవుడు
జానకి జాడలను దెలియ, జాలినవారిన్
తానుంబంపించుటకై
మానసమున దలుప దెలిసి. మాధవరామా! 90

క. శ్రీరాముడాంజనేయుని
చీరియు నుంగరము నొసంగి, సీతాసతికిన్
వీరుడవామెను దెలుసుక
చేరుము నాకడకటంచు జెప్పెను రామా! 91

క. వానరుల గలసియాతడు
తాను సముద్రంబుజేరి ధైర్యముతోడన్
పూని వినువీధికెగసియు
దానవులంకాపురంబు, దగ్గర రామా! 92

క దిగియాంజనేయుండగ
తగవుకులంకిణియు రాగతాయుద్ధమునన్
తెగటార్పందీరి శాపము
పొగడుచు దివికేగియామె, పోయెను రామా! 93

క హనుమానుడు వెనువెంటనె
తనువున్ సూక్ష్మంబుజేసి, తడయకలంకన్
పనిబూని వెదకి సీతను
గనుగొనగాలేక కలతగా శ్రీరామా! 94

క. కలియు దిరిగిలంకాపురి
కలకంఠినిగానకపుడు, కరువలి కొడుకున్
చలమునవెల్లెడ, వెదకుచు
విలపించుచుగనెనశోక, విపినము రామా! 95

క. పవనజుడశోకవనమున
నివసించెడు సీతనెర్గి, నివ్వెరపడితా
సవినయముగ శ్రీరాముని
నవముద్రికనీయనామెనమ్మెను రామా! 96

క. రావణునిజూడదలచియు
తావనమును బెరికివిఱువ, తక్షణమచ్చో
నావనపాలకులుంజని
రావణునకు దెలుపనతడు, రఘుకులరామా! 97

క. అక్షయకుమారునింగని
వీక్షించియు నీవువాని, వేగముతోడన్
భక్షతను గట్టితెమ్మిక
శిక్షించెదననుచు బలికె, శ్రీరఘురామా! 98

క. అక్షయునిగాంచి హనుమాన్
వక్షంబున వానిబొడువ, వాతరక్తమున్
అక్షులనుండియు వెడలగ
వృక్షమువలె వాడుగూలె, పృథ్వినిరామా! 99

క. తన చిన్నకొడుకు, జావగ
తన పెద్దకుమారునంపతఁడయ ఘనతుడున్
తన యస్త్రబంధనంబున
గొని పోబడెనాంజనేయు, గుణనిధి రామా! 100

క దశకంఠుడాంజనేయుని
విశదంబుగ రామబలము, వివరింపుమనన్
దశకంఠ నీకు మిక్కిలి
దశరథ సుతుబలమటంచు, తాననెరామా! 101

క. రావణుడతి కోపంబున
నీవనచరుజంపుమనుచు, నిడనాయాజ్ఞన్
న్నావినివిభీషణుడుతా
నీవిధి దూతలనుజంప నెగ్గనెరామా! 102

క. అని తెలుప రావణుండటు
వినీ తమ్ముని మాటలవుడు, వెనువెంటనెయా
వనచరుని తోకగాల్చగ
పనిబూనియొసంగెనాజ్ఞ, ప్రభు శ్రీరామా! 103

క. రాక్షసులాయాజ్ఞన్విని
నాక్షణమే వారునిప్పు, నంజను సుతుకున్
శిక్షింతు మనుచుబెటమ
హాక్షేపన్ గలుగజేయనప్పుడు రామా! 104

క. తోకన్ మంటలు మండగ
బ్రాకెన్ రావణునిమేడ, పైకెగిరియుతా
జోకన్ లంకాపురిపై
దూకెన్ ధూమంబులెగయ, దుడుకున రామా.... 105

క. భుగభుగమని పొగలెగసెను
ధగధగమని మంటలెగసి, దావానలమై
నిగనిగమనుచు న్నిప్పులు
సెగలెల్లను చిమ్మెదిశల, శ్రీహరి రామా! 106

క. స్త్రీబాలవృద్ధ జనములు
గాబరబడి యిండ్లలోన, గాలుచునుండన్
చేబూని తోకమారుతి
తాబెట్టెను తప్పినిండ్లు, తగులగ రామా! 107

క. లంకనుగాలిచి హనుమాన్
గ్రుంకిసముద్రంబునందు, కోయని పైకిన్
సుంకించి యుగసియావల
పొంకంబుగ దుమికి దరికి, బోయెను రామా! 108

క. అచ్చట వానరులంగని
చచ్చురనందరును గలిసి జగములు బెదరన్
వచ్చియు వానర బలములు
దెచ్చితిమనీ సీతకథను, దెలిపిరిరామా! 109

క. శ్రీరామాజ్ఞను వానర
ధీరులు భల్లూకవరులు, తేజము తోడన్
వీరాలాపము లాడుచుఁ
జేరిరి సంద్రంపుగట్టు శ్రీరఘురామా! 110

క. అచ్చట రాముండుండగ
వచ్చి విభీషనుడు రామభద్రు పదములన్
జచ్చెర శరణని వ్రాలియు
హెచ్చుగ నభయంబు గోరె, హితమతిరామా! 111

క. భయపడకు నిన్నుగాచియు
రయమున రావణుని జంపి, లంకకు నిన్నున్
దయతోనిపుడే రాజుగ
నియమించితిననుచు ప్రతిన, నెరపినరామా! 112

వ॥ ఇటు శ్రీరామచంద్రుడు సముద్రపు గట్టున వానర సమూహముతో నివసించియుండగా, రావణునిచిన్నతమ్ముడు విభీషణుడట కరుదెంచి, రామచంద్రుని పాదారవిందములను బట్టి, తనకు అభయప్రదానం బొసగుమని శరణువేడెను అవుడు రామచంద్రుడాంజనేయుని విచారించి, హనుమానుని

సలహాగొని విభీషణునక భయంబొసంగి. రావణునిసంహరించి, లంకకురాజును జేయుదునని, ఆంజనేయునిచే లంకానగరమును, ఇసుకలో చిత్రింపజేసి, తక్షణమే యాయిసుక లంకకు విభీషణునకు రాజ్యాభిషిక్తుజేసెను.

అటుపిమ్మట, రామచంద్రుడు సముద్రపుచెంత దర్భశయ్యపై పరుండి ఉపవాసనియమము మూడు దినములు దీక్షతో సముద్రునిగూర్చి ప్రార్థించినను సముద్రుడు ప్రత్యక్షము కాలేదు. అందుకురాముడు కోపించి ధనస్సెక్కుబెట్టి సముద్రముపై వేయుటకు బ్రహ్మాస్త్రము మొనకు చేరిముత్యమువలెగాప్పించుచుండెను సముద్రము బీడయ్యెను. అంతట సముద్రుడు తన భార్యలైన నదీనదాలతో మనుష్యరూపములుదాల్చి రామునికడకుచేరి తమతప్పును సైరింపుమనియు, సముద్రము మీద, పర్వతములను దెచ్చివేసి నలుని చేతిలో వంతెన నిర్మింపుమని చెప్పి, శ్రీరాముని కరుణకు పాత్రులై వెడలిపోయిరి. ఎప్పటియట్ల సముద్రము, నీటితోనిండి తొణుకులు బడుచు డెను

క. లంకకు బోవలెనాకున్
పొంకంబుగ త్రోవనిమ్ము, పోయెదనని, యాలింపుమటన్న సముద్రుండు
జంకక యుండుటను జూచి జానకిరామా! 112

క. కోపంబున బ్రహ్మాస్త్రము
చాపంబును నెక్కుబెట్టి జలనిధి యపుడున్
ప్రాపుగ నస్త్రపు మొనకున్
జూపట్టెను ముత్యమటుల, చూడగరామా! 113

క. అంత సముద్రుడు రాఘవు
చెంతకు నరుదెంచినన్ను శిక్షింపకు మీ
వంతెన గట్టియు నాపై
సంతసమున చనుమటన్న, సరగునరామా! 114

క. శ్రీరాము నాజ్ఞనందరు
తీరంబున, జేరియుచట, దృఢదీక్షమెయిన్
వారధి గట్టియు లంకకుఁ
జేరిరి వానరులు చిలిపి, చేష్టల రామా! 115

క. దానవబలముల తోడను
వానరులున్ బోరుసల్పి, వారిని గూల్పన్
దానవపతి రావణునిన్
మానవరూపమున గూల్చి మసలిన రామా! 116

క. లంకకు రాజు విభీషణు
పొంకముగాజేసి తునిది. భూసుతసీతన్
శంకలు దీరగ నగ్నిన్
పంకజముఖి నంపెనపుడు ప్రభు శ్రీరామా! 117

క. సీతమ్మ నగ్ని వెడలియు
భూతలమున కరుగుదేర. బుధులుగనంగన్
సీతండ్రి దివిజవరులున్
సీతయు నిర్దోషినునుచు, జెప్పిరిరామా! 118

క. రావణుని పుష్పకంబును
రావించియునందులోన, రమణీయముగా
సేవింప వానరులతో
గావించె ప్రయాణమపుడు. క్రమ్మర రామా! 119

క. ఎల్లరయోధ్యకు జేరగ
నిల్లంబుల సంతసిల్లి, నొనరుగ తల్లుల్
యుల్లాసంబుగ జూచుచు
చల్లగ సంతోషులైరి, సరగున రామా! 120

క భరతుడు నీపాదుకలను
గురుతరముగదెచ్చి యొసగి, గొనియిక నీవున్
విరివిగ నయోధ్యనేలుచు
కరుణింపుము నన్నటంచు, గలిసెను రామా! 121

క. మునివరులు దేశ ప్రజలున్
ఘనముగ పట్టాభిషేక కార్యములెల్లన్
పనిబూని కొఱతలేకయె
వెనువెంటనె, జేరిరపుడు. వేగమె రామా! 122

క. సీతయు లక్ష్మణ భరత స
మేతముగా, యాంజనేయు, మేటి గుణులుతా
ప్రీతిగ శత్రుఘ్నుండును
ఖ్యాతిగ సేవలును జేయఁగల్గిరి రామా! 123

వ॥ శ్రీరామచంద్రుడీవిధముగా లంకలో రావణాది రాక్షసులను జంపి, విభీషణుని లంగాధిపతిన్ జేసి. మహా పతివ్రతయగు సీతన్ దీసికొని, సుగ్రీవ విభీషణాదులు వెంటరాగా, పుష్పక విమానంబులో నందరును. అయోధ్యకు జేరి తల్లులు ప్రజలు, సంతోషించుచుండగా. వశిష్టాది మౌనీంద్రులాశీర్వాద

ములతో వైభవోపేతముగా పట్టాభిషేకమహోత్సవము గావింపబడెను. ఆసమయమున సమస్త మునీంద్రులతోను, రాక్షస, వానర ప్రముఖులతోను, శ్రీరామ చంద్రుని కొలువు కూటము, కిటకిటలాడుచుండెను. ఆ సమయమున అగస్త్య మహామునీంద్రుడు, శ్రీరామ చంద్రుని జూచి, ఆ కొలువులోనున్న వీరులను వారి పరాక్రములను, వేరువేరుగా ప్రశంశించుచు. లక్షణుని జూచి, ఇతడు మహా వీరుడు, ఇంద్రజిత్తును తెగటార్చిన ఈయన పరాక్రమ మనన్య సామాన్యమని అగస్త్య మహాముని దెలుపగా, రామచంద్రుడగస్త్య మునీంద్రునితో. ఓ ముని శ్రేష్టా! కుంభకర్ణుడు కంపనుడు, అకంపనుడు, ధూమ్రాక్షుడు, యూపాక్షుడు దుర్ముఖ. ప్రహస్త, రావణాది మహావీరులనందరిని విడచి ఇంద్రజిత్తే మహా ప్రతాపశాలియని మీరతనిని బొగడుచున్నారు అని యడుగగా, అగస్త్యమహా మునీంద్రుడిట్లనెను.

ఓ రామా! తొల్లిదేవాసుర యుద్ధములో దేవేంద్రునకు, రావణునకు ఘోర యుద్ధము జరిగినపుడు దేవేంద్రుడు, రావణుని బలహీనపరచి, అతనిని పట్టి కట్టివేయుటకు యత్నించుచుండు సమయమున ఇంద్రజిత్తడగమనించి తన తండ్రిని దేవేంద్రుని బారినుండి తప్పించి. యుద్ధములో దేవేంద్రునోడించి అతనిని తన రథస్తంభమునకు బంధించుకొని పోయి లంక జేరెను. పిమ్మట బ్రహ్మదేవుడరుదెంచి ఇంద్రజితునకు వరములొసగి. దేవేంద్రుని విడిపించు కొని పోయెను. అందువలన ఇంద్రజిత్తును మహా యోధుడుగాను అతనిని జయించినలక్ష్మణుని అతనిని మించిన యోధుడిగా చెప్పవలసి వచ్చెను అది యునిగాక లక్ష్మణుడు మహా యోధుడనుటకు మఱియొక కారణము కలదు మీరడవులకుబోవునపుడు నిద్రాదేవి లక్ష్మణునావహించెను ఆయన నిద్రాదేవితో నిట్లు దెలిపెను ఓ నిద్రాదేవీ నేను మరలా అయోధ్య చేరువరకు పదునాలు సంవత్సరములు నీవునాచెంతకు రావలదు నాపాలి నిద్రగా, నాభార్యనూర్మిళకు పగటి సమయములో రాత్రిలో ఆమెవంతుగా బట్టుము. అని తెలుపగా ఆమె అటులేయని లక్షణుని చెంతచేరలేదు లక్ష్మణ స్వామి మీకు రాత్రుళ్ళలో ధనుర్బాణధారియై గస్తు దిరుగుచు డును పగటి కాలములో కందమూలాది. అహారములు మీకు సమకూర్చుచుండును కానీ ఆయనకు నిద్రలేకపోవడమే గాక, అహారము కూడ లేకుండెను విలననగా అయన తెచ్చియిచ్చిన ఫలాదులను మీరాయనకు తినుమని యివ్వలేదు మీరివ్వనందున అయన తినలేదు. తెచ్చినవాడుతినియుతడునని మీరనుకొన్నారు మీరివ్వలేదే తినకూడదని ఆయ ననుకొన్నాడు. ఈ విధముగా నిద్రాహారములు లేనివాడై పదునాల్గు సంవత్సరములు గడిపియుండెను ఇంద్రజిత్తు పదునాలుగు సంవత్సరములు నిద్రాహారములులేనివానిచేత జయింపబడున కావున మన లక్ష్మణస్వామి అవ్రతమూ చరించియున్నందువలన ఆయన ఇంద్రజిత్తునుజయింపగలెను బల అతి బల

యను విద్యలానాడు విశ్వామిత్రమహర్షి వలన మీరు తెలిసికొనియుంటిరి అ విద్యల ప్రభావము వలననే ఇంతవరకు మన లక్ష్మణస్వామి, బలాన్వితుడై జీవించియుండగల్గెను. ఇది ఇంద్రజిత్తును పొగడుటకును, లక్ష్మణుని ప్రశంశించుటకును ప్రత్యేక కారణమని తెలిపి, రాజాంతఃపురమునకు కబురంపగా ఇప్పుడే ఊర్మిళ నిద్రలేచినదని సమాధానము వచ్చెను అది విని సభాసదులెల్లరును సంతోషించిరి అటువంటి ఇంద్రజిత్తున గన్నతండ్రి రావణుని జన్మ వంశ వృత్తాంతములను దెలుపవలసినదిగా అగస్త్యుని రామచంద్రుడు కోరెను. అగస్త్యుడీవిధముగా, రావణ వృత్తాంతమును చెప్పసాగెను.

క. నిండు సభలోన లక్ష్మణు
డుండ నగస్త్యుడు జూప, నూర్మిలనాథున్
దండిగ గొనియాడియు, తా
ఖండనమున నింద్రజిత్తు, బలిగొనె రామా! 124

క. దండిమగండని లక్ష్మణు,
దండి పరాక్రమముం బొగడ, తమ్ముని చేతన్
దండింపబడిన యాతని
తండ్రిని రావణుని గూర్చి, తా శ్రీరామా! 125

క. వినవలెనని నాకున్నది
వినిపింపు మటంచు రామ, విభుడడుగంగన్
పనివడి మునివర్యుడు తా
వినిపించెను రావణాఖ్య, విధమును రామా! 126

క. రావణుడు చెడ్డవాడని
భావించియుం దిట్టుచుంద్రు బహువిధములుగా
రావణుని మేలు దెలియక
పొపుటచే దిట్టుచుంద్రు. పొరబడి రామా! 127

క. రావణుని కాలమందున
భావింపగ చాలమంది, బాధలు పడినన్
రావణుడు మరణ మొందగ
పావన శ్రీరామకరుణ, బడసిరి రామా! 128

క. శ్రీమన్నారాయణునిన్
భూమిపయున్ రాముడగుచుం బుట్టించుటకున్
తామెంత కష్టపడెనో
ధీమంతులుం దెలియవలయు, దీనిని రామా! 129

క. రాముని జన్మకు నిజముగ
కామాంధుడు రావణుడు కారణమయ్యెన్
కామాంధుడు గాడాతడు
రామునికై నటనజేసె, రఘుకులరామా! 130

క. రావణుడు కారణంబని
భావించియు నతనిమేలు, బహు దొడ్డదిగా
భూవలయంబున కిపుడది
పావనకరమనుచు దెలయ, బడవలె రామా! 131

క. చేసెనుర ఘోరతపంబులు
కోసెను తన కంఠములను, కుండము వ్రేల్పన్
వాసిగ తొమ్మిది శిరములు
వేసియు నా హోమమటుల, వ్రేల్చెను రామా! 132

క. ఇట్టుల పదివేలేడులు
కట్టడియై తపముఁజేసి, కడపటి శిరమున్
అట్టేగోయగ కత్తిన్
బెట్టుగ మెడమీద నతడు, బెట్టెను రామా! 133

క. పుట్టెను ప్రళయములెన్నొ
దట్టంబగు మంటలెగసి ధరణీతలమున్
జుట్టెను పొగబంధురమై
యట్టే వినువీధినిండె, యటు శ్రీరామా! 134

క. అదిగని దేవతలందరు
వదపదమని బ్రహ్మకడకు, పరువున జనితా
నిదిగో దశకంఠుడును
పది యవతలగోయ, యత్నపడె శ్రీరామా! 135

క. వాడాతలయున్ గోసిన
కీడగు లోకంబులకును, ఖేదము గలుగున్
వాడడుగు వరములిమ్మని
వేడిరి యాబ్రహ్మనవుడు, వేల్పులు రామా! 136

క. వెనువెంట బ్రహ్మదేవుడు
చనుదెంచియు రావణు నిది సాహసమని తా
వినుతించి కత్తిదీసియు
కొనుమొసగెద. వరములను కోరెను రామా! 137

క. వరములు గోరుచు బ్రహ్మను
నరులన్, వానరుల విడచి, నాతోనెవరున్
దురమొనరించిన వారే
విరివిగ నోడంగ వరము వేడెను రామా! 138

క. నరుడై నిను బుట్టింపగ
వరమడుగక విడచెగాని, వాడు మరచునే?
తరమా! నమ్మంగలమా
మనువశు రావ ఏ మంచిమతి శ్రీరామా! 139

క అవకాశము నీకొసగియు
భువిపై నీతోడఁబోరి పుట్టుకలేకే
భవసాయుజ్యముఁజెందనెపు
భవించెను రావణుడుగ, భవహర రామా! 140

క. గురునాజ్ఞ లేకనాతడు
పొరబాటున సేయలేదు బోరులనెల్లన్
గురునాజ్ఞ పొందియాతడు
గురుతర యుద్ధములుజేసె, గుణనిధి రామా! 141

క గురువుకడగేగి యాతడు
శరణంబును బొంది మిగుల శాస్త్రోక్తముగా
గురునుపదేశంబదియు
విరివిగ మోక్షము లభించు, విధమును రామా! 142

క. పరమాత్మునితో ఢీకొని
మరణించినవారి పుణ్యమహిమలు దెలుపన్
దరమా! రావణ నాకది
పరమ పవిత్రులకు గల్గు, భాగ్యము రామా 143

క. యోగము గంగా స్నానము
బాగుగ నోంకారజపము, భజనలు తపముల్
సాగించు వారికంటెను
వేగమె మోక్షంబు బొందు విధమనె రామా 144

క. సనత్కుమారుండిట్టుల
వినిపింపగ రావణుండు విని వెనువెంటన్
తన మంది మార్గలంబుల
పనిబూనియు యుద్ధములకు, బలముగ రామా 145

క. తెలిసిన వెంటనె యాతడు
పలువిధముల దుండగములు, ప్రబలము జేసెన్
చలిపెట్టియు దిక్పతులను
తలపడి యుద్ధములుజేసె. తారకరామా! 146

క. అది మొదలు. మొదలు బెట్టెను
బుధజనులను బాధపెట్టి, పుణ్యస్త్రీలన్
బెదరించి చెరలు బట్టెను
కదనంబున దేవతలను, గలిచెను రామా! 147

క. పరలోకంబున నుండియు
నరలోకంబునకు దిగియు, నారాయణుడే
నరుడై జననంబందంగ
విరివిగ తా రాజబాట వేసెను రామా! 148

క. కష్టములనతడు బొందుచు
కష్టముల నందరిని బెట్టి, కనుబెట్టినుడై
దుష్టుడుగ తానె గనబడి
శిష్టుల హితయొద్ధకనిపె శ్రీరఘురామా! 149

క. వారందరు వైకుంఠము
చేరంజని హరినిగాంచి, చిత్తములందున్
దారుణ దశకంఠునితో
వారికిగల బాధ దెలిప, వారికిరామా! 150

క. శిష్టుల సంరక్షించెద
దుష్టుల నేదునిమివైచు దురమున వారిన్
నిష్ఠుర దురహంకారిని
భ్రష్టుండగునటులజేతు, పదమనె రామా! 151

క. అభయంబు వారికొసగియు
శుభగుణుడు నారాయణుండు, సురుచురలీలన్
ప్రభవించె రాముడగుచును
విభవంబుగ దశరథునకు వేడ్కగ రామా! 152

క. నరుడై రావణుదునిమెను
దురమున రాక్షసులనెల్ల, ద్రుంచెన్ కడిమిన్
నరవానరులీ విధమున
కరమొప్పగ లోకములను, గాచిరి రామా! 153

క. తనకొరకు మేడగట్టుక
పనిబూనియు నందునొక్క, పంకా సేయన్
తనకేగా కాగాలియు
పనివానికి సుఖముజేయు పగిదిని రామా! 154

క. రావణుడు రాముకొఱకై
గావించిన దుండగములు, కారణములుగా
భూవలయంబున రాముడు
గా వచ్చియు పుట్టవలసె ఘనహరి రామా! 155

క. ఈ విధముగ దశకంఠుడు
గావించిన యత్నమెల్ల, కడు మేలగుచున్
భూవలయంబున రాముని
పావనపద ముద్భవించెను, భవహర రామా! 156

క భారత దేశమునందున
శ్రీరాముని మందిరములు, స్థిరముగ వెలసెన్
ఆ రామచంద్రు భజనలు
నూరూరన్ జేసి ముక్తినొందగ రామా! 157

వచనము:- ఇట్లగస్త్య మహామునీంద్రుడు శ్రీ రామచంద్రునకు, రావణు వృత్తాంతమంతయు దెల్పి ఓ రామచంద్రా! రావణుడు జీవించి యున్న కాలములో జరిగిన దుండగములన్నియు, రావణ వధానంతరము, ఇప్పుడు రామరాజ్యము, అనగా నీ రాజ్యము జరుగుచున్నది. అతని రాజ్యంలో కష్టపడినవారికి, నీ రాజ్యములో సుఖసంతోషములు జెందుచున్నారు ప్రజలు. వారికిపుడెట్లున్నదనగా. వేసవి కాలమున. మిట్టమధ్యాహ్నం ఎడారిలో, మండు టెండలో, నడచు బాటసారికి ఎడారి గట్టుకు చేరగానే, అక్కడ దగ్గరలోనే నొక మంచినీటి సరోవరంబును, దానిగట్టున సన్నని యిసుకయు పై భాగమున దట్టమైన నీడగల, సువాసనలను విరజిమ్ము, పొన్నవృక్షంబును నుండగాజూచి నీరుద్రావి ఆ వృక్షపునీడన ఇసుకలో విశ్రాంతి తీసికొనునపుడు, ఆ పుష్పవనమునుండి, నేతెంచు, పిల్లగాలులు సోకినపుడతని మనస్సెంతహాయిననుభవించునో. ఆ విధముగా నీ రాజ్యములో ప్రజలు సుఖించుచున్నారని రామరాజ్యమును ప్రశంసించెను.

ఇక శ్రీ రామచరిత్ర చివరివరకును:-
రావణరాజ్యం తర్వాత. రామరాజ్యము.-

క. శ్రీరామా నీ రాజ్యము
నేరాజులు సేయలేక, నివ్వెర పడగా
పారావారమునందలి
వారలు నీ రాజ్యమనగ, వలతురు రామా! 158

క నెల మూడువర్షములు బడి
కలకలలాడుచును వసుధ, గనిపింపంగా
తిలకింప గోవులన్నియు
నొలకించెను పాలుపెరుగు నొసరుగ రామా! 159

క. దండిగ పంటలుబండుచు
పండిన విత్తనమెరాలి పైరైపండున్
మెండుగ ధనధాన్యంబులు
నిండెను ప్రజలిండ్లనింద. నీదయరామా! 160

క ఎక్కడ జూచిన హోమము
లక్కజముగ జరుగుచుండె నతినియమమునన్
దిక్కులు బిక్కటలంగను
గ్రక్కునయావేదమంత్ర, గానమురామా! 161

క. యమధర్మ రాజురాముని
సమధర్మము తెల్లజూచి సంబరపడుచున్
గమనించి పండు ముసలుల
సమయంబున గొనుచుంబోవు, సరగున రామా! 162

క మీరేలు రాజ్యమందున
జారులు, చోరులును, లేరు, చంచల మతులున్
క్రూరులు, పరధన, హరులున్
నేరంబుల వారులేరు, నిజమిది రామా! 163

క. క్షత్రియ రాజులు మీకున్
మిత్రులుగా మార్పుచెంది, మీ పైభక్తిన్
కృత్రిమముల్ గావింపక
మిత్రత్వము తోడవారు మెలగుచు రామా! 164

క. యుద్ధములు మానివైచిరి
బుద్ధులు ధాధర్మనిరతి. పాటింపగన్
యుద్ధములు లేని కతమున
తద్దయుసుఖ శాంతులమరె. దశరథ రామా! 165

క. దానములిచ్చెద మన్నను
దానంబులు గోరరెవరు, తమ రాజ్యములో
దీనులు హీన దరిద్రులు
గానరుగా మచ్చుకైన, కఠినులు రామా! 166

క. కుక్కొకటి నీవాకిట
నిక్కముగ నిలిచియేడ్వ, నీవద్దానిన్
గ్రక్కున విషయము దెలునుక
చక్కని న్యాయంబుసేయ, జాలిన రామా! 167

క. ఒక గ్రద్ద గ్రుడ్లగూబను
తికమకబెట్టియును దాని, స్థిరమగుగూటిన్
బ్రకటించినాదటంచును
నెకసక్కెములాడి తరుమ, నేర్చెను రామా! 168

క. గ్రద్దది నేరంబనుచును
బుద్ధిన గమనించి దాని, పొలియింపంగన్
గ్రద్దయొక రాచవాడై
తదయు శాపంబుదీర, తరలెను రామా! 169

క. ప్రజలున్ మెచ్చరటంచును,
నిజముగ నిందించిరనుచు నిజసతిసీతన్
సుజనుడు లక్ష్మణునంపియు
విజనారణ్యములో విడచి, వేసిన రామా! 170

క. యమధర్మరాజుమునియై
సమయంబును గోరిమిమ్ము, సంభాషింపన్
గమనింపకెవరువచ్చిన
తమకరవాలమున తలను, దరుగగ రామా! 171

క. మీరును మాటనొసంగియు
దారికి లక్ష్మణునిబెట్టి, తాభాషింపన్
క్రూరుడు దుర్వాసుడుతా
గోరెను లక్ష్మణుని దాగి, కుజనత రామా! 172

క. అడిగిన దుర్వాసునుకున్
కడువినయము తోడమ్రొక్కి, కడువడితానే
జడియుచు రాముని జేరియు
తడయక లక్ష్మణుడు గాంచె తనరగ రామా! 173

క. తమ్ముని జూచిన రాముడు
నెమ్మనమునబాధజెంది, నేజేసిన యా
సమ్మతి, ప్రతినన్ యెట్టుల
తమ్ముని తలదరుగగలను, తానని రామా! 184

క. అని శ్రీరాముడువగచుచు
తన ధర్మము విడువ లేక, తహతహ పడచున్
మునులారా ! నాకిప్పుడు
వినిపింపుడు ధర్మమార్గ, విధమును రామా! 185

క. ధర్మము డెలిసిన వారిని
ధర్మంబును దెలుపుడనుచు, తగిన విధమునన్
మర్మంబుగోరమునులున్
ధర్మాపద్ధర్మములను, దరచియు రామా! 186

క. తలదీసెడు మీ ప్రతినకు
తలదీయక లక్ష్మణునకు, ద్వేషించియును తా
నిలలో నీ రాజ్యంబున
నిలువకనెటకైనబంప, నేఎగు రామా! 187

క. అని తెలుపగ లక్ష్మణునిన్
తన తమ్ముడెయన రాజ ధర్మంబున కై
తనరాజ్యమందు నిలుపక
బనిపిన నీ హృదయమెంత, బలమది రామా! 188

క. అటు విమ్మట లక్ష్మణుడున్
పటుతరముగ వరయునదికి, బరతెంచియు తా
తెగువగు ధైర్యము తోడను
తటుకున తాబోయిమునిగి, నానటు రామా! 189

క. తమ్ముడు బోయిన కతమున
నెమ్మనమున దాళలేక, నిజపుత్రులకున్
సమ్మతి రాజ్యంబొసగియు
తమ్ములు పురజనులు తోడ తారకరామా! 190

క. రమ్మనియ వతారంబును
సమ్మతినుపసంహరింప, సాకేతపురిన్
తమ్మనుసరించు వారికి
గ్రమ్మర తమ వెంటవచ్చు, గాంక్షను రామా! 191

క. మనుజులు పశుపక్ష్యాదులు
తనవెంటను రాగరామ, ధరణీశ్వరుడున్
వెనువెంట సరయునదికిన్
గొని పోయెను సంతసంబు, గూర్పగరామా! 192

క. అందరు గలసియు సరయువు
నందున తమదేహములను, నరమరలేకే
పొందగ మనుగన్ జేయుచు
సంధించిరి రామమంత్రస్నానము రామా! 193

గావింప వారలందరు
గోవిందుని రూపులగుచు, గ్రొమ్మెరుపులతో
సేవించుచు శ్రీనాథుని
భావింపగ విష్ణుపటుల బరగిరి రామా! 194

శ్రీరాముని నరరూపము
నారాయణ రూపమగుచు నదిమూనుగకనే
మారెను నాసమయంబున
ధారాళముగాను రామ, తనువున రామా! 195

శ్రీరామున తలమీదను
వారకనొక నూరుకోట్లు, వనరుగ సూర్యుల్
చేరి వెలింగెడు విధమున
నారాముకిరీట మందునమరెను రామా! 196

వాసుకి శేషుల విధమున
భాసురముగ చేతులప్పుడు, బహుదీప్తంబై
వాసిగ నాలుగు భుజములు
నాసమయంబునను మొలచె, నరనుత రామా! 197

చేతుల శంఖము చక్రము
ప్రీతిగ శార్ఙ్గాదిఖడ్గ, విరచముశెల్లన్
ఖ్యాతిగ వక్షమునందున
నూతన కౌస్తుభములక్ష్మి, యుండిరి రామా! 198

ఆయన పొక్కిలియందున
సోయగముగ మెరసె బ్రహ్మ, సొబగగుతమ్మిన్
మాయని బంగరు చేలము
పాయక మొలయందుగాను నయ్యెను రామా! 199

క. లోకములందరు జూడగ
ప్రాకటముగ దివ్యభాష, వంక్తులతోడన్
శ్రీకాంతునందుగనబడె
వాకొనలేనట్టి, సొబగువర్ధిలె రామా! 200

క. కోటి పదికోట్లు మఱిశత
కోటులుగల సూర్యలొక్క కూటమియై తా
ధాటిగ వెలుగు విధంబున
మేటిగ శ్రీ విష్ణువగుచు మెరసెను రామా! 201

క. నారాయది డాడినమున
శ్రీరాముడిగా జనించి, చేరెను భువికిన్
అ రాముడీదినంబున
నారాయణుడగుచుమారె, నరనుతరామా! 202

క. మారిన శ్రీహరి యంతట
చెరెగవైకుంఠమునకు, జనుదెంచునెడన్
చేరిరి శివుడున్ బ్రహ్మయు
నారాయణుప్రక్కదెసల, నడచుచురామా! 203

క. చతురాననుండు వేదము
చతురతబఠియించుచుండ శంభుండంతన్
గతరామచరితమంత వి
నుతిజేయుచు, బోవుచుండె నెనరుగ రామా! 204

క. హరిమీద పుష్ప వర్షము
గురిపింపగ దేవతలును. కోమలి జనముల్
విరివిగ దుందుభి మొదలగు
సురచిర వాద్యములు మ్రోగె సురనుత రామా! 205

క. భూలోకంబునుండియు
పై లోకంబులను గడచి, ప్రభుశ్రీహరియున్
మేలగు వైకుంఠములో
కాలిడగానెదురు జనియె, కమలయు రామా! 206

క. ముందర లక్ష్మియు నడువగ
నందరు వైకుంఠ పతిని నాహ్వానింపన్
బృందములై తాబోవుచు
చిందులుద్రొక్కుచును హరిని చేరిరి రామా! 207

క. హరినిన్ గొనితా వచ్చియు
పరమాత్ముని మందిరమున, భక్తి గజేర్పన్
పరమానందంబున హరి
సరగున శ్రీదేవిజేరి. సరసత రామా! 208

క. నెలకొని వైకుంఠంబున
గలవారలకందరకును, కనువిందగుచు
చెలువుగ శేషుని పాన్పున
పలువిధసౌఖ్యములు హరియు, బడసెను రామా! 209

క రావణుని కారణంబున
రావలసెను హరియునాడు, రాముండగుచున్
దావచ్చి పోయినందున
కోవెలబూరవారవెలసె, కోటులు రామా! 210

క. కావున రాముని రాకకు
రావణుడే కారణంబు, రావణుడిటులన్
దేవుని తాగొనిదెచ్చియు
జీవులకందించెనిటుల, శ్రీరఘురామా! 211

క. శ్రీరాముడీవిధంబున
పారాడగ భరతభూమి, ప్రవిమలమయ్యెన్
ఆరాము భారతావని
చేరి జనింపగ ఘనత, చేకురె రామా! 212

క. పరుసము సోకినను మును
వరుసగ బంగారమైన, పడుపున భూమిన్
నరుడుగ రాముని పాదము
దిరుగ పవిత్రంబునయ్యె, స్థిరముగా రామా: 213

క ఈ రామ శతకమెవ్వరు
పారాయణ, జేసిరేని, పరమాత్ముండా
శ్రీరాముకరుణ చేతను
వారికినిహపరము గల్గు, పనరుగ రామా 214

క రామా, రామా రామా
రామా శ్రీరామ రామ రామా రామా
రామా రామా రామా
రామా పట్టాభిరామా రామా రామా 215

క. రామాయను నీనామము
నేమారకదలచువారి, నిన్దయతోడన్
రామాగాచుచునుండవు
సామీప్యమునందు నిలచి, పరగున రామా! 216

క. యమలోకము నీ భక్తులు
తమకన్నుల జూడబోరు, తనరుచువారున్
విమలింపు ముక్తిక్షేత్రా
తమ వైకుంఠంబుఁ జేరెదరు శ్రీరామా 217

క. మంగళమో శ్రీ రామా!
మంగళ మాశ్రిత సమాజ, మధురసునామా
మంగళ తారకనామా
మంగళమగు రామ నీకు, మాధవరామా! 218

ఇది శ్రీరామ ద్విశతి, యను సంగ్రహ రామాయణే, పరలోక ప్రాప్తే, ఇహలోక విభవే, ఆదికావ్యే అఘసంహారిణే ఆనందదాయకే, అమృత ప్రసాదే అజ్ఞాననివారణే జనన మరణ రహితే జనప్రియ దాయకే, లంకిపల్లి ఓబయ్యనాయుని ప్రణీతంబైన శ్రీరామ ద్విశతి యనుసంగ్రహ రామాయణము సంపూర్ణము !

